


ఒకనాడు ఒక వడ్రంగీ, ఒక కమ్మరీ వాదించుకున్నారు.

"నేను నీకంటె నేర్పరిని?" అన్నాడు వడ్రంగి.

"అదేమన్నమాట? నేను నీకంటె ఎన్నోరెట్లు నేర్పరిని," అన్నాడు కమ్మరి.

ఈవిధంగా వాళ్లు ఎంతసేపు వాదించుకుని కూడా ఎటూ తేల్చుకోలేకపోయినారు. అందుచేత వాళ్లు రాజుగారి నడిగి ఎవరు నేర్పరి అయినదీ తేల్చుకుందామనుకున్నారు.

రాజు వారిద్దరినీ చూసి, "ఏం పనిమీద వచ్చారు?" అని అడిగాడు.

వడ్రంగి ఈవిధంగా చెప్పాడు: "అయ్యా, నేను వడ్రంగిని. నా పనితనంతో ఎన్నో చిత్రవిచిత్రమైన వస్తువులు తయారుచేసి ఉన్నాను. కాని ఈ కమ్మరి నాకన్న తాను ఎక్కువ నేర్పరితనం గలవాణ్ణని వాదిస్తున్నాడు."

"నా పనితనం చూసినవాళ్ళంతా నన్ను వెయ్యినోళ్ళ పొగడుతున్నారు. అయినా ఈ వడ్రంగి నాకన్న తెలివిగలవాణ్ణని అంటున్నాడు," అన్నాడు కమ్మరి.

"మహారాజా, మా ఇద్దరిలోనూ ఎవరి పనితనం గొప్పదో తమరే తేల్చాలి!" అని ఇద్దరూ రాజును వేడుకున్నారు.

తీర్పు ఎలా చెప్పాలో రాజుకు తోచలేదు. "మీ ఇద్దరి పనితనమూ మేము చూడలేదు. అలాటప్పుడు మీ ఇద్దరిలో ఎవరు నిపుణులో ఎలా తేల్చటం? మీరిద్దరూ వెళ్ళి చెరొక

సి. మాధవరావు



వస్తువూ తయారు చేసి పది రోజులలో తిరిగిరండి. మీరు తయారు చేసిన వస్తువులను పరిశీలించి, మీలో ఎవరి పనితనం హెచ్చో నిర్ణయిస్తాము!" అన్నాడాయన.

వడ్రంగీ, కమ్మరీ రాజుగారి వద్ద సెలవు తీసుకుని తమతమ ఇళ్లకు వెళ్ళిపోయి పని ప్రారంభించారు. పదోరోజున కమ్మరి ఒక ఇనప చేపను తయారుచేసి తెచ్చి రాజుగారికి సమర్పించాడు.

"ఇది ఎందుకు పనికివస్తుంది?" అని రాజు అడిగాడు.

"ఈ చేపమీద ఒకలక్ష ధాన్యపు బస్తాలు వేసినప్పటికీ నీటిలో మునగకుండా



సముద్రంలో తేలిపోతుంది," అన్నాడు కమ్మరి. ఈమాట వినేసరికి రాజుకు నవ్వొచ్చింది. కమ్మరి పట్టి మూఢుడనీ, అవివేకంగా ప్రగల్భాలు పలుకుతున్నాడనీ ఆయన అనుకున్నాడు. ఆయన తన మనుషులతో, "ఈ చేపను సముద్రంలో ఉంచి దీనిపైన లక్ష బస్తాల ధాన్యం పెట్టి ఇది తేలిపోతుందేమో చూడండి," అన్నాడు.

రాజభటులు ఆ చేపను సముద్రంలో ఉంచి, దానిపైన ఒక లక్ష ధాన్యంబస్తాలు ఎక్కించారు. చిత్రంగా ఆ ఇనపచేప సముద్రంమీద ఈదుతూ కదిలింది.

రాజు కమ్మరి నేర్పరితనాన్ని ఎంతో మెచ్చుకుని అతన్ని తన నగరంలో ఒక వీధికి పెద్దగా నియమించాడు.

ఈలోపల వడ్రంగి కొయ్యతో ఒక గుర్రాన్ని చేసి పట్టుకొచ్చాడు. దాన్ని చూడగానే రాజుకు నిరుత్సాహం కలిగింది.

"ఇదేమిటి? చిన్నపిల్లలు ఆడుకునే వస్తువు చేసి తెచ్చావు. దీన్ని కమ్మరి చేసిన ఇనప చేపతో పోటీ పెడదామనేనా నీ ఉద్దేశం?" అని రాజు వడ్రంగిని అడిగాడు.

"మహారాజా, రెంటికీ పోలిక ఏమిటి? దీనిముందు ఆ ఇనపచేప ఏపాటిది? ఈ వరసగా ఉన్న ఇరవైఆరు మరలూ చిత్తగిం



చండి. వీటిలో మొదటిది వదులు చేస్తే చాలు గుర్రం గాలిలోకి ఎగురుతుంది. ఆ తరవాత ఒక్కొక్క మరే వదులు చేసిన కొద్దీ గుర్రం వేగం హెచ్చిపోతుంది. అన్ని మరలూ వదులుచేస్తే ఇది వాయువేగాన్ని మించి ఎగురుతుంది. దీన్ని ఎక్కినవాళ్ళు ఆకాశంలో సంచరించటమే గాక అతి సులువుగా ప్రపంచమంతా చుట్టి రావచ్చు!" అన్నాడు వడ్రంగి.

వడ్రంగి ఈ మాటలు అంటూండగా రాజుగారి ఆఖరుకొడుకు అక్కడికి వచ్చాడు. ఎగిరే గుర్రమన్న మాట వింటేనే వాడికి ఎక్కడ లేని ఉత్సాహమూ పుట్టుకొచ్చింది. ఆకాశంలో ఎగురుతూ కిందికి చూస్తే ప్రపంచం కనిపించటం ఎంత సరదాగా ఉంటుందోగదా అనుకున్నాడు వాడు. ఆ గుర్రంమీద ఎక్కి ఒక్క షికారు తిరిగిరావటానికి అనుమతి ఇవ్వమని వాడు తండ్రిని బతిమాలాడు.

"ఇంకా నయం! అసలది ఎగురుతుందో లేదో ఎవరు చూశారు? ఒకవేళ ఎగిరినట్టు ఎగిరి కిందపడిపోతే ఏంగాను?" అని రాజు కొడుకును మందలించాడు.

వడ్రంగి రాజుగారి మాటకు అడ్డు వచ్చి, "మహారాజా, మీకు అలాటి అపోహ వద్దనే



వద్దు. ఏ పరిస్థితిలోనూ ఈ గుర్రం కింద పడి ప్రమాదం జరగదు," అన్నాడు.

రాజకుమారుడు తండ్రి దగ్గిర మారాం చెయ్యటం మానలేదు. తండ్రికి వాడంటే గారాబం, అందుచేత వాడి మాట తీసెయ్యలేక చివరకు ఒప్పుకున్నాడు. ఆయన రాజకుమారుడితో, "మరీ వేగంగా వెళ్లకు సుమా. ఒక్క మర మాత్రమే వదులు చెయ్యి," అన్నాడు.

రాజకుమారుడు అందుకు ఒప్పుకుని కొయ్యగుర్రం ఎక్కి మొదటి మర వదులు చేశాడు. నిజంగానే గుర్రం గాలిలోకి ఎగిరింది. రాజకుమారుడు కిందికి చూస్తే

కొండలూ, నదులూ, చెట్లూ, మనుషులూ, నగరాలూ కనిపించాయి. వాడికి ఎక్కడ లేని ఉత్సాహమూ వచ్చింది. వాడు వరసగా ఇరవైఆరు మరలూ వదులుచేశాడు. కొయ్య గుర్రం అంతులేని వేగంతో పోసాగింది.

అలా చాలాసేపు ఆకాశంలో ప్రయాణించి నాక రాజకుమారుడికి ఆకలి వేసింది. అదృష్టవశాత్తూ వాడికి సమీపంలోనే ఒక నగరం కనబడింది. వాడు మరలన్నీ వరసగా బిగించాడు. గుర్రం వేగం క్రమంగా తగ్గింది. అది పక్షిలాగా దిగివచ్చి నేలపై వాలింది. వాడు సుష్టుగా భోజనంచేసి ఒక సత్రంలో బస ఏర్పాటుచేసుకున్నాడు.

ఆ రోజు వాడు చేసిన ప్రయాణం వాడికెంతో సంతృప్తి నిచ్చింది. ఏమంటే, వాడు కొద్దిసేపట్లోనే ఎక్కడో ఉన్న నగరాన్ని, ఎన్నడూ చూడనిదాన్ని కొయ్యగుర్రం సహాయంతో చేరుకోగలిగాడు.

ఆ రాత్రి నిద్రపోయి మర్నాడు ఉదయమే నగరం చూడటానికి బయలుదేరాడు. రెండు వీధులు దాటేసరికల్లా ఒక చౌకు వచ్చింది. అక్కడ జనం నిలబడి తలలెత్తి శూన్యాకాశంలోకి చూస్తున్నారు. ఆకాశంలో ఏమీ లేదు. "వీళ్ళు ఎందుకిలా చూస్తున్నారా?" అనుకుని వాడు వారిని సమీపించి, ఒకణ్ణి పలకరించి,



"మీరంతా ఆకాశంలో ఏమిటి చూస్తున్నారు?" అని అడిగాడు.

ఆ మనిషి రాజకుమారుణ్ణి ఎగాదిగా చూసి పరదేశి అని గ్రహించి ఈ విధంగా చెప్పాడు: "మా రాజుగారి కొక కుమార్తె ఉన్నది. ఆమె జగదేకసుందరి. ప్రపంచంలో ఎక్కడా అంత అందగత్తె ఉండబోదు. ఆ కూతురంటే రాజుగారికి పంచప్రాణాలూనూ. ఆమెను ఇతరులు కళ్లతో చూసినా ఆయన సహించలేడు. ఆమె రాజభవనంలో ఉండినంత కాలమూ ఆయనకు కొంచెం కూడా మనశ్శాంతి లేకపోయింది. అందుచేత ఆయన ఆమెకోసం మబ్బులమీద ఒక గగన సౌధం కట్టించి, అందులో ఆమెను ఒక్కతెనూ ఉంచాడు రోజూ కాలకృత్యాలు పూర్తి కాగానే ఆయన గగన సౌధానికి వెళ్లి ఆమెను చూసి తిరిగి వస్తూంటాడు. ఇవాళ ఆయన వెళ్ళి కొంతసేపయింది. ఆయన రాకకోసం మేమందరమూ ఎదురుచూస్తున్నాం."

రాజకుమారుడికి ఇదంతా పట్టి కట్టు కథలాగా కనిపించింది. "మబ్బుల మీద ఇల్లు కట్టటం ఎలా సాధ్యమవుతుంది?" అని వాడు అడిగాడు.

"అది ఒక సిద్ధుడు తన మహిమచేత నిర్మించాడు. ఒక్క రాజుగారు మాత్రమే అక్కడికి వెళ్ళి రాగలరు," అన్నాడు అవ






తలి మనిషి. ఈ వింత విషయం రాజకుమారుడి మనసును ఆ రోజల్లా వేధించింది. ఆ గగన సౌధం సంగతి ఏమిటో తేల్చుకోవాలనే ఉద్దేశంతో వాడు ఆ రాత్రి బాగా చీకటి పడ్డాక తన కొయ్యగుఱ్ఱం ఎక్కి ఆకాశంలోకి ఎగిరాడు.

కొంత ఎత్తు ఎగిరేసరికి నిజంగానే గగన సౌధం కనిపించింది. వాడు తన గుఱ్ఱాన్ని ఆ భవనం దగ్గిరికి తీసుకుపోయి ద్వారంవద్ద దాన్ని నిలిపి, దిగి, లోపల ప్రవేశించాడు.

లోపలికి ఎవరో వస్తున్న అలికిడి విని రాజకుమార్తె తన తండ్రే వచ్చాడుకాబోలు



అనుకున్నది. కాని ఆమె కొత్తవాణ్ణి చూసి తన తండ్రి కాదని గ్రహించి, ఆ వచ్చినవాడు ఎవరో దేవత అయి ఉంటాడనుకున్నది. ఎందుకంటే మామూలు మానవులెవరూ ఆ భవనం చేరలేరు. అతనికి స్వాగతం చెప్పే ఉద్దేశంతో ఆమె తన ఆసనంమీది నుంచి లేచి నిలబడింది.

రాజకుమారుడు తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. ఎందుకంటే రాజకుమార్తె నిజంగా అపురూప సుందరే. అతనిలో ప్రేమ పొంగి పొర్లింది. "ఆహా, ఇటువంటిది నాకు భార్య అయితే నాకింకేం కావాలి?" అనుకున్నాడు వాడు.

రాజకుమార్తెకు కూడా రాజకుమారుడి పైన ప్రేమ పుట్టుకొచ్చింది. "మా నాన్న నన్ను ఇక్కడ నిర్బంధంలో ఉంచటం మూలంగా నేను ఎవరినీ చూడలేకుండా ఉన్నానుగద. ఇలాటి యువకుడు నన్ను ప్రేమించేటట్టయితే ఇంక నాకు కావలిసిందేమిటి?" అని ఆమె అనుకున్నది.

ఇద్దరూ ఒకరి మనసులొకరు అతి సులువుగా అర్థంచేసుకుని గాంధర్వ వివాహం చేసుకున్నారు. రాజకుమారుడు ఆ రాత్రి గగన సౌధంలో గడిపి, తెల్లవారుగట్ల తన కొయ్యగుఱ్ఱంమీద సత్రానికి తిరిగి వచ్చేశాడు.





అతను వెళ్ళిన కొద్దిసేపటికి రాజు ఎప్పటిలాగే తన కుమార్తెను చూడవచ్చాడు. లోపలికి అడుగు పెడుతూనే ఆయనకు, ఎవరో పరాయివాళ్లు అక్కడికి వచ్చినట్టు అనుమానం తగిలింది. దానికి తోడు రాజకుమార్తె మామూలుకన్న హెచ్చు ఉత్సాహంలో ఉన్నట్టు కనబడింది.

ఇది చూసి రాజుకు భరించరాని బాధ పుట్టుకొచ్చింది. ఆయన కూతురితో ఏమీ అనకుండా తన భవనానికి తిరిగివచ్చి, "గగన సౌధంలోకి ఎవరు వచ్చి ఉంటారు? ఎలా వచ్చి ఉంటారు?" అని తీవ్రంగా ఆలోచించసాగాడు.

రాజుగారు విచారంలో ఉండటం గమనించి మంత్రులు ఆయన విచారానికి కారణమేమిటని అడిగారు. ఆయన వారితో తన అనుమానం గురించి చెప్పి, "నేను తప్ప మరెవరూ అక్కడికి పోలేరుగదా! గడిచిన రాత్రి అక్కడికి వచ్చిన మనిషి ఎవరో వాణ్ణి ఎలా పట్టుకోవటమో కాస్త ఆలోచించి చెప్పండి!" అని అడిగాడు.

"మనవద్ద నలుగురు మహాయోధులున్నారు. మీరు వారిని గగన సౌధానికి తీసుకుపోయి ఈ రాత్రి ఆ భవనం నాలుగు మూలలా కాపలా ఉంచండి. రాత్రివేళ నిజంగా ఎవరన్నా అక్కడికి వచ్చేపక్షంలో వాళ్లు తప్పక వాణ్ణి పట్టుకుంటారు!" అన్నారు మంత్రులు.

"భేష్, ఈ ఆలోచన దివ్యంగావుంది," అని రాజు ఆ సాయంకాలం నలుగురు యోధులనూ గగన సౌధానికి నాలుగు మూలలా కాపలా ఉంచి ఇంటికి తిరిగి వచ్చాడు.

కాని ఈ యెత్తు పారలేదు. ఆ మహాయోధులు కాపలా కాస్తూనే నిద్రపోయారు. రాజకుమారుడు ఆ రాత్రి గగన సౌధానికి రానేవచ్చాడు. రాత్రంతా రాజకుమార్తెతో గడిపి తెల్లవారుఝామున వెళ్ళిపోయాడు.

—(ఇంకా వుంది)






## 2

మర్నాడు రాజు గగన సౌధానికి వెళ్ళి చూసే సరికి, గడిచిన రాత్రి మళ్లీ ఎవరో అక్కడికి వచ్చి వెళ్ళారనీ, తన యోధులు ఆ మనిషిని పట్టుకోలేకపోయారనీ స్పష్టమయింది. రాజుకు కోపంతో నోట మాట రాలేదు.

ఈలోపల ఈ వృత్తాంతం నగరమంతా పొక్కింది. "విన్నావా? రాజుగారు గగన సౌధంలో దాచి ఉంచిన రాజకుమార్తె దగ్గిరికి ప్రతిరోజూ ఎవడో వచ్చి పోతున్నాడట! ఎంత అపఖ్యాతి!" అని పౌరులు ఒకరితో ఒకరు చెప్పుకో నారంభించారు. రాజుగారికి వీధిలోకి వెళ్లటానిక్కూడా మొహం చెల్లలేదు.

ఆయన తన మంత్రులలో చురుకైనవాణ్ణి పిలిపించి, "అమ్మాయి దగ్గిరికి వచ్చిపోతున్న ఆ దుర్మార్గుణ్ణి పట్టుకోవటానికి ఏదైనా ఉపాయం ఆలోచించు," అని అడిగాడు.

"మహారాజా, గగన సౌధం అంతటా, అక్కడి సామగ్రిమీదా రంగు చల్లించండి. ఆ సౌధంలోకి ఎవడైనా వచ్చి క్షణంసేపు కూర్చున్నప్పటికీ వాడి బట్టలకు రంగు అంటుతుంది. ఆ తరవాత మనం నగరమంతా ఘాలించి ఆ దుర్మార్గుణ్ణి సులువుగా పట్టుకోవచ్చు," అని మంత్రి రాజుకు ఉపాయం చెప్పాడు.

ఈ ఉపాయం రాజుకు నచ్చింది. ఆ సాయంకాలం ఆయన గగన సౌధానికి వెళ్లి అక్కడ ఉండే కుర్చీలమీదా, మంచాల మీదా, అంతటా రంగు చల్లాడు.

న. మాధవరావు



ఎప్పటిలాగే రాజకుమారుడు ఆ రాత్రి గగన సౌధానికి వచ్చి తెల్లవార్లూ రాజకుమార్తెతో గడిపాడు. తెల్లవారబోతూండగా కొయ్యగుర్రంమీద నగరానికి దిగివస్తూ తన దుస్తులనిండా రంగు ఉండటం గమనించాడు. వెంటనే వాడు వాటిని ఊడదీసి కింద పారేశాడు. ఆ దుస్తులనిండా ముత్యాలూ రత్నాలూ కుట్టి ఉన్నప్పటికీ వాడు లక్ష్యపెట్టలేదు.

రాజకుమారుడు దిగిన నగరంలో ఒక పేద వృద్ధుడు ఉండేవాడు వాడు రోజూ చీకటితోనే లేచి అందరినీ ఉదయపు ప్రార్థనలకు లేవగొట్టుతూ ఉండేవాడు. వాడు అలవాటు



ప్రకారం తెల్లవారుఝామున వీధులవెంబడి తిరుగుతూ ఉండగా పైనుంచి ఏవో దుస్తులు పడటం కనిపించింది.

వాడు ఎక్కడలేని ఆశ్చర్యంతో వాటిని ఎత్తి చూసి చాలా మేలైన దుస్తులని గ్రహించి ఎంతో ఆనందం పొందాడు.

"నిశ్చయంగా భగవంతుడే నాకోసం వీటిని పడవేసి ఉంటాడు. బుద్ధెరిగినప్పటి నుంచీ ఆ భగవంతుడి సేవలోనేగదా నేను కాలం వెళ్ళబుచ్చుతున్నాను; అందుకని ఆయనకు నాపై అనుగ్రహం కలిగి ఉంటుంది!" అనుకున్నాడా వృద్ధుడు. వాడు వాటిని పట్టుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

రోజూ సాయంకాలంవేళ నగర ప్రజలందరూ దేవాలయానికి వస్తారు. పేద వృద్ధుడు తనకు రానున్న కష్టాన్ని కొంచెం కూడా తెలుసుకోలేక, భగవంతుడు తనకు ప్రసాదించిన దుస్తులు ధరించి, అందరిలాగే తానుకూడా దేవాలయానికి వెళ్ళాడు.

ఎవరి బట్టలకు రంగు అంటిందో అని చూస్తూ రాజభటులు అక్కడే తారట్లాడుతున్నారు. వాళ్ళ కళ్ళు ఈ వృద్ధుడిపై పడ్డాయి. వాడు తనమానాన తాను దైవ ధ్యానం చేసుకుంటున్నాడు. వాడి బట్టలకు అంటిన రంగు గమనించి రాజభటులు వాణ్ణి



ఛ్యానిస్తున్నపాళంగానే పట్టుకుని రాజుగారి దగ్గిరికి లాక్కుపోయారు.

వృద్ధుణ్ణీ, వాడి ఒంటిపైన ఉన్న దుస్తులకు అంటిన రంగునూ చూడగానే రాజు రక్తం ఉడికిపోయింది. ఆయన అతనితో, "నీ బట్టలకు ఈ రంగు ఎలా అంటింది ?" అని అడిగాడు.

"నా కవి వీధిలో దొరికినప్పుడే వాటికి రంగు అంటి ఉన్నది, మహారాజా!" అన్నాడు వృద్ధుడు.

రాజు వాడి మాటలు నమ్మక వాణ్ణి జైలుకు పంపించాడు. అక్కడి అధికారులు వృద్ధుణ్ణి హింసించి, బలాత్కారంగా నేరం చేసినట్టు వాడిచేత ఒప్పించారు. తరవాత వాడి చేతులకు బేడీలు తగిలించి ఉరితీయటానికి రచ్చకూడలికి తీసుకువెళ్ళారు.

ఈ నేరస్థుణ్ణీ, వాడికి జరిగే శిక్షనూ కళ్ళారా చూడటానికి జనం వేలకువేలుగా ఎగబడ్డారు. రాజకుమార్తె వద్దకు ఎవడో రహస్యంగా వచ్చి పోతున్నట్టు అదివరకే నగరమంతా పాక్కిపోయింది. ఇప్పుడా మనిషి దొరికిపోయినట్టు అందరికీ తెలిసింది. రాజకుమార్తెలాంటి అపురూప సుందరిని సమ్మోహింపజేసినవాడు ఎలా ఉంటాడో చూడాలని ప్రజలు తహతహలాడారు.




తీరా చూడబోతే పట్టుబడినవాడు ముసలివాడు. వాణ్ణి అందరూ ఎరుగుదురు. ఆ వృద్ధుడు రోజూ రహస్యంగా గగన సౌధానికి వెళ్ళి, రాత్రి అంతా రాజకుమార్తెతో గడిపి వస్తున్నాడంటే జనానికి నమ్మకం కలగలేదు.

వాణ్ణి ఉరితీయటం హత్యే తప్ప మరేమీ కాదని వారు అనుకున్నారు.

రాజకుమార్తె ప్రియుడు దొరికాడనీ, వాడు తన నేరం ఒప్పుకున్నాడనీ, వాడికి ఉరిశిక్ష విధించి రచ్చకూడలిలో ఉరితీయబోతున్నారనీ జనం అనుకోవటం రాజకుమారుడి చెవుల పడింది. వాడు వెంటనే






న్నాడు. ఎవరిని ఉరితీయాలో సెలవిప్పించండి!" అన్నాడు.

"నేరం ఒప్పుకున్న యువకుణ్ణే ఉరి తియ్యండి," అన్నాడు రాజు. నేరం ఒప్పుకున్నవాడు యువకుడని విన్నాక, వృద్ధుడు దోషి అయి ఉండటం అసంభవమని ఆయనకు కూడా రూఢి అయింది.

రాజుగారి అనుమతి అందగానే కొత్వాలు వృద్ధుడి మెడకు తగిలించిన ఉచ్చు తీసి, వాణ్ణి వదిలిపెట్టాడు తరవాత ఆయన రాజకుమారుణ్ణి పట్టుకోమని తన భటులను ఆజ్ఞాపించాడు.

తన కొయ్యగుర్రాన్ని చంకనబెట్టుకుని రచ్చకూడలికి పరిగెత్తాడు. వాడు చేరేసరికి వృద్ధుడి మెడకు ఉచ్చుకూడా తగిలించారు.

"ఉరి తీయకండి! వాడు నిరపరాధి! గగన సౌధానికి వెళ్ళి రాజకుమార్తెతో ఉంటున్నవాణ్ణి నేను. వృద్ధుడిపైన ఉన్న దుస్తులు నావే. కావలిస్తే నన్ను చంపండి. వాణ్ణిమాత్రం వెంటనే విడిచిపుచ్చండి!" అని రాజకుమారుడు కేకలుపెట్టాడు.

కొత్వాలు ఉరి నిలుపుచేయించి రాజు దగ్గిరికి ఒక మనిషిని పంపాడు. ఆ మనిషి వెళ్ళి రాజుతో, "మహారాజా, రచ్చకూడలికి ఒక యువకుడు వచ్చి తానే దోషినంటు

వాళ్లు తనదగ్గిరికి వచ్చేలోపుగా రాజకుమారుడు కొయ్యగుర్రాన్ని కిందపెట్టి, దానిపై కూచుని, మరలు వదులుచేసి, అందరూ చూస్తుండగానే ఆకాశంలోకి లేచిపోయాడు. ఈ దృశ్యాన్ని దూరంనుంచి కళ్లారా చూస్తున్న రాజుకు భరించరానంత కోపం వచ్చి, స్పృహతప్పి పడిపోయాడు.

రాజకుమారుడు సరాసరి గగన సౌధానికి వెళ్లాడు. వాడు రాజకుమార్తెను కలుసుకుని, "మన ప్రేమ రాను రాను ప్రాణాంతకంగా పరిణమిస్తున్నది. నన్ను విడిచి నువు ఉండలేవు, నిన్ను విడిచి నేనూ ఉండలేను. మన రహస్యం మీ తండ్రికి తెలిసిపోయింది



గనక, ఆయన నన్ను నగరంలో ఎక్కడ ఉన్నా వేటాడుతాడు. ఈ ఆపద తప్పించుకోవాలంటే ఒకటే మార్గం. నువుకూడా నావెంట మా దేశానికి వచ్చెయ్యి. మా వాళ్లు నిన్ను చూసి తప్పక సంతోషిస్తారు!" అన్నాడు.

"నిన్ను వదిలిపెట్టనని నేను అదివరకే నిశ్చయించుకున్నాను. నీవు ఎక్కడికి పోయినా నేను నీ వెంట వస్తాను. దాన్ని గురించి వేరే ఆలోచించవలిసిన పనిలేదు," అన్నది రాజకుమార్తె.

ఇద్దరూ గగన సౌధం వెలపలికి వచ్చి, కొయ్యగుర్రంపైన ఎక్కి కూచుని ఆకాశ మార్గాన ప్రయాణమయారు.

వాళ్ళు ఎన్నో నదులూ, కొండలూ, అడవులూ దాటి ఒక ఎడారిమీదుగా ఎగిరిపోతూ ఉండగా రాజకుమార్తె, "అరెరే, పెద్ద పొరపాటు జరిగిపోయింది. మనం మళ్లీ వెనక్కు వెళ్ళాలి!" అన్నది.

"వెనక్కు వెళ్ళటం దేనికి?" అన్నాడు రాజకుమారుడు.

"నా చిన్నతనంలో మా అమ్మ నాకు రెండు ఆభరణాలిచ్చింది. నేను పెద్దదాన్నయి పెళ్ళాడే సమయంలో వాటిని నా అత్తమామలకు కానుకలుగా ఇవ్వవలిసి ఉంటుందని ఆవిడ నాతో చెప్పింది. వాటిని తొందరలో మరిచిపోయి వచ్చేశాను.





మీ ఊరికి అవి లేకుండా ఎలా పోవటం?" అన్నది రాజకుమార్తె.

"ఈ భాగ్యానికేనా? ఆ ఆభరణాలు లేక పోతే మానే లే! మనం చాలా దూరం వచ్చేశాం," అన్నాడు రాజకుమారుడు.

"లేదు, లేదు. అవి లేకుండా నేను రాను. పెళ్లికి అత్తమామలకు కట్నాలివ్వక పోయానో నాకు బతికున్నంత కాలమూ తల వంపులుగానే ఉంటుంది," అన్నది రాజకుమార్తె.

అమె మనసును బాధపెట్టటం ఇష్టంలేక రాజకుమారుడు మరలు బిగించి గుర్రాన్ని నేలపై దించాడు. అతను ఆమెతో, "నీకోసం



నే నిక్కడనే వేచి ఉంటాను. నీవు గుర్రం మీద వెళ్లి, ఆ అభరణాలు తీసుకుని, ఇక్కడ ఉన్నట్టుగా తిరిగిరా!" అన్నాడు.

రాజకుమార్తె సరేనని కొయ్యగుర్రంమీద ఎక్కి వచ్చిన దారినే గగన సౌధానికి తిరిగి పోయింది.

ఈలోపల అక్కడ స్పృహతప్పి పడి పోయిన రాజుగారికి మంత్రులు శైత్యోప చారాలు చేసి తెలివి తెప్పించారు. స్పృహ తెలుస్తూనే ఆయనకు తన కుమార్తె మాట జ్ఞాపకం వచ్చింది. ఆయన ఆదరాబాదరా బయలుదేరి గగన సౌధానికి వెళ్లాడు. ఎంత వెతికినా ఆయనకు రాజకుమార్తె కనిపించ లేదు. పిట్ట ఎగిరిపోయింది. గగన సౌధం ఖాళీ పంజరంలాగా ఉంది.

ఆయన ఏమి చెయ్యటమా అని ఆలో చిస్తూ మతిపోయి కూచుని ఉండగా అంత దూరాన రాజకుమార్తె ఆకాశంలో కని పించింది. ఆమె తన అభరణాలకోసం గగన సౌధానికి ఒంటరిగా కొయ్యగుర్రం మీద తిరిగి వస్తున్నది. రాజు ఒక మంచం వెనక దాక్కుని, రాజకుమార్తె లోపలికి అడుగు పెట్టగానే చప్పున ఇవతలికి దూకి, పట్టుకుని, ఆమెను గగన సౌధం నుంచి తన భవనానికి తీసుకువెళ్ళాడు.



రాజు ఇదివరకల్లా తనకుమార్తె పెళ్లి గురించి ఎంత తాత్సారం చేస్తూ వచ్చాడో ఇప్పుడు ఆమెకు పెళ్లి చెయ్యాలని అంత తహతహ లాడిపోయాడు. కాని ఆమెను ఎవరు పెళ్లాడతారు. ఆమెపై పుట్టిన ప్రవాదు ఆ చుట్టుపక్కల అంతటా వ్యాపించించి. ఆ ప్రాంతాల గల గౌరవ కుటుంబాలలో వాళ్లెవరూ ఆమె ఎత్తు ధనం పోసినా ఆమెను పెళ్లాడరు.

కాని దూరదేశపు రాజుకు ఒక కొడు కున్నాడు. ఆ రాజు రాజకుమార్తె అంద చందాలను గురించి ఘనంగా విని ఒకప్పుడు ఈ రాజుకు రాయబారం పంపి, "మా అబ్బా యికి మీ అమ్మాయిని ఇచ్చి పెళ్లిచేస్తారా?" అని కబురు చేశాడు.

అప్పట్లో ఈ రాజుకు తన కుమార్తె పెళ్లి ఆలోచన ఏకోశానా లేనందున, "మా అమ్మాయి కింకా పెళ్లిఈడు రాలేదు. అందు చేత ఇప్పుడప్పుడే ఆమెకు పెళ్లిచేసే ఉద్దేశం మాకు లేదు," అని దూరదేశపు రాజుకు జవాబు చెప్పాడు.

రాజుకు ఇప్పుడా సంగతి జ్ఞాపకం వచ్చింది. తన కూతురి అపఖ్యాతి అంత దూరం వెళ్ళి ఉండదు. ఆమెనిచ్చి పెళ్ళి చేస్తానంటే ఎగిరి గంతేసి వస్తారు. అందు కని రాజు ఆ దూరదేశపు రాజుకు ఇలా వర్తమానం చేశాడు: "మీరు ఒకప్పుడు మా అమ్మాయిని మీ అబ్బాయికిచ్చి పెళ్లి చెయ్యమని కోరి ఉన్నారు. అప్పటికి మా అమ్మాయికి పెళ్లియీడు రానందున అలా చేయలేకపోయాము. ఇప్పుడు మా అమ్మా యికి వివాహవయసు వచ్చింది. మీ అబ్బా యిని మా నగరానికి పంపినట్టయితే మా అమ్మాయినిచ్చి పెళ్లిచేసి పంపగలము. ఈ వివాహంద్వారా మనం బంధువుల మవు తాము గనక మన రెండు దేశాల మధ్యా స్నేహసంబంధాలు బలపడగలవు."

—(ఇంకా వుంది)






## 3

ఇక్కడ రాజుగారు ఈప్రకారంగా తన కుమార్తెకు పెళ్ళి ప్రయత్నాలు చేస్తుంటే, అక్కడ తన ప్రియురాలికోసం ఎదురు చూస్తున్న రాజకుమారుడు ఏంచేస్తున్నాడు?

అతను ఎంతసేపు చూసినా రాజకుమార్తె తిరిగి రాలేదు. అతను దిగిన ప్రదేశం కటిక ఎడారి. కనుచూపుమేరదాకా ఇసక దిబ్బలు తప్ప ఒక చెట్టుగాని, చేమగాని, ఆఖరుకు గరికగాని లేదు. అంతకంతకూ సూర్యుడు పైకి రావటంవల్ల వేడి రెచ్చిపోతున్నది. గాలి గట్టిగా వీస్తూ ఇసుకను అటూ ఇటూ చెరుగుతున్నది; చిన్న చిన్న ఇసుక దిబ్బలను ఒక చోటనుండి ఊడ్చి మరొకచోట పోగుపెడుతున్నది.

రాజకుమారుణ్ణి ఆకలి దప్పులు బాధిస్తున్నాయి. ఎక్కడైనా ఒక చిన్న చెలమ కనిపిస్తుందేమోనని అతను ఆ ఇసుక దిబ్బల మధ్యగా కాళ్ళు పడిపోయేలాగ తిరిగాడు. ఎత్తునుంచి చూస్తే మరింత దూరం చూడవచ్చుననుకుని వాడు అన్నిటికన్న ఎత్తయిన ఇసుకదిబ్బ మీదికి ఎక్కాడు. అడుగు తీసి అడుగు పెట్టినప్పుడల్లా మోకాలుదాకా ఇసుకలో దిగబడిపోతూండటంచేత ఎక్కటం మహా ప్రయాస అయింది. వాడు ఆ దిబ్బ పైభాగాన్ని చేరుకునేసరికి మహా పర్వతాన్ని ఎక్కినంత శ్రమ తోచింది.

వాడు దిబ్బ పైభాగాన్ని చేరుకుని చుట్టూ కలయచూసేటందుకు తల ఎత్తాడో

సి. మాధవరావు




లేచే, అంతలోనే కాళ్ళకింద ఇసక కరిగి పోతున్నట్టయింది. వాడు అగాధంలోకి దిగబడిపోతున్నట్టయింది. వాడు కొంత దూరం అలా జారి, చివరకు ఎలాగో కాలు నిలవదొక్కుకో గలిగాడు. అప్పుడు తల ఎత్తి చూసేసరికి వాడికి ఒక దివ్యమైన పళ్ళచెట్ల తోపు కనిపించింది. అక్కడవున్న వన్నీ పళ్ళచెట్లే. ప్రతి చెట్టూ నవనవలాడు తున్నది. అన్ని చెట్ల కొమ్మలకూ గుత్తులు గుత్తులుగా, బరువుగా పళ్ళూ, పచ్చి కాయలూ ఉన్నాయి.

ఆ చెట్లనూ, పళ్ళనూ చూడగానే రాజ కుమారుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది.



వాడు తోపులో ప్రవేశించి ఎర్రగా పండి సువాసన కొట్టే కొన్ని పళ్ళను కోసుకుని ఆవురావురుమని తినేశాడు. ఆ పళ్ళు మహా రుచిగా ఉన్నాయి.

వాటిని తింటుంటే రాజకుమారుడి ఆకలీ దప్పీ కూడా తీరిపోయాయి.

అలా వాడు ఎర్ర పళ్ళతో కడుపు నించు కునేసరికి నిద్ర వచ్చింది. వాడు చల్లని నీడలో ఒక చెట్టు బోదె నానుకుని సుఖ నిద్రలో మునిగిపోయాడు.

వాడు కొంతసేపటికి నిద్ర మేలుకుని చేతులతో మొహం నిమురుకునేసరికి చేతికి పెద్ద బవిరిగడ్డం తగిలింది. వాడు నిర్ఘాంత పోయాడు. ఏమి జరిగినదీ వాడికి అర్థం కాలేదు. వాడికి ఏనాడూ గడ్డం లేదు. ఈ విషయమే ఆలోచిస్తూ ఆశ్చర్యపోతూ ఉంటే వాడికి మళ్ళీ ఆకలి వేసింది.

కాని ఈసారి వాడు ఎర్రపళ్ళ జోలికి పోలేదు. వాటిని చూస్తే వాడికి అనుమానం కలిగింది. అందుచేత వాడు ఈసారి పచ్చ పళ్ళ చెట్లను సమీపించి, కొమ్మలు వంచి, గుత్తులు గుత్తులుగా వేళ్ళాడే ఆ పళ్ళలో బాగా పండి సువాసనలు వెదజల్లుతున్న పళ్ళను కోసి కడుపునిండా తినేశాడు. ఈ పళ్ళు ఎర్రపళ్ళకన్న కూడా రుచిగానూ,



రసంకలిగి ఉన్నాయి. అందుచేత వాడా పళ్ళను ఎక్కతొక్కనట్టుగా తిని మళ్ళీ చెట్టుకు చేరగిలబడి నిద్రపోయాడు.

మళ్ళీ వాడికి నిద్ర మెలకువ వచ్చేసరికి సూర్యాస్తమానమయి, చీకటి పడబోతున్నది. వాడు బద్ధకంగా ఒళ్ళు విరుచుకోవటంలో తల చెట్టుబోదెకు కొట్టుకున్నది. ఆ తల మామూలుకన్న ఎక్కువ బరువుగా ఉన్నట్టు కూడా వాడికి అనిపించింది. తల తడివి చూసుకోవటంలో వాడి చేతికి రెండు లావు పాటి కొమ్ములు తగిలాయి! దీనికి తోడు వాడి గడ్డం మూరెడు ప్రమాణం పెరిగి తెల్లగా నెరిసిపోయి ఉన్నది!

తన ఆకారం ఎలా ఉన్నదీ తలుచుకుంటేనే వాడికి గుండెలు అవిసిపోయాయి. "ఇదేం ప్రారబ్ధం? వెళ్ళిన రాజకుమార్తె రాలేదు. నా అవతారం ఇలా మారిపోయింది. ఒకవేళ ఆమె వచ్చినా ప్రయోజనం శూన్యం. ఈ రూపంలో ఆమె నన్ను పోల్చుకోలేదు. ఒకవేళ పోల్చుకుంటేమటుకు, ఈ గడ్డంతోనూ, కొమ్ములతోనూ ఉన్న నన్ను ఎలా ప్రేమిస్తుంది? నేను సమస్తమూ కోల్పోయాను—రాజకుమార్తెనూ, కొయ్యగుర్రాన్నీ కోల్పోయాను; నన్ను నేనే కోల్పోయాను!" అంటూ వాడు విలపించి విలపించి, ప్రాణం సొమ్మసిల్లి మళ్ళీ నిద్రపోయాడు.



ఆ నిద్రలో వాడికొక కల వచ్చింది. ఆ కలలో ఒక వృద్ధుడు వాడి ఎదట నిలబడి వాడి తల నిమురుతూ, "ఎందుకు, నాయనా, విచారిస్తున్నావు?" అని అడిగాడు.

రాజకుమారుడు వృద్ధుడికి తన గొడవ అంతా చెప్పుకున్నాడు.

"విచారించకు. చెట్ల కింద రాలి ఎండి పోయిన ఎర్ర పళ్ళూ, పచ్చ పళ్ళూ తిన్నా వంటే నీ రూపు మళ్ళీ మారిపోతుంది, నీ గడ్డాలూ, మీసాలూ, కొమ్ములూ రాలి పోతాయి. అసలు ఈ ప్రాంతం వదిలి వెళ్లిపో, బాబూ. ఇది భూతాలుండే స్థలం. అవి ఇంకా నిద్ర లేవకపోవటంచేత నువు బతికి పోయావు. అవి లేచే వేళ అయింది," అన్నాడు వృద్ధుడు.

రాజకుమారుడీ మాటలకు నిర్ఘాంత పోయాడు. వాడు నిద్ర లేచి కళ్ళు నులుము కుని పైకి చూస్తే నడి ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తూ కనిపించాడు. చలిగాలి వీస్తు న్నది. ఎడారి ఇసుక ఇప్పుడు కాలటంలేదు. కలలోని వృద్ధుడి సలహా ప్రకారమే వాడు చెట్ల కింద దొరికిన ఎండు కాయలను, ఎర్ర వాటినీ, పచ్చవాటినీ ఏరుకుని తిన్నాడు. తలా, ముఖమూ తడివి చూసుకుంటే గడ్డాలూ, మీసాలూ, కొమ్ములూ పోయి నట్టు స్పష్టమయింది.



తరవాత వాడు కొంత తుంగ పీకి దానితో ఒక బుట్ట అల్లుకున్నాడు. ఆ బుట్టలో ఇన్ని ఎండిన ఎర్ర పళ్ళూ, పచ్చ పళ్ళూ, పండిన ఎర్ర పళ్ళూ, పచ్చ పళ్ళూకూడా నించుకుని, గబగబా ఆ తోపును దాటి దూరంగా బయలుదేరాడు.

వాడి ఉద్దేశం తన దేశానికి పోవాలని. కాని అది ఎటుగా ఉన్నదీ వాడికి తెలియదు. చేసేదిలేక వాడు ముక్కుసూటిగా నడిచాడు. ఎంతదూరం వెళ్ళినా ఇసుక తప్ప మరేమీ కనబడలేదు. ఆకలి అయినప్పుడు ఎండిన పళ్ళు తింటూ, అలిసిపోయినప్పుడు ఇసుకలో పడుకుంటూ ఏడు పగళ్ళూ, ఏడు రాత్రులూ నడిచి ఎలాగైతేనేం ఒక రహదారి చేరుకున్నాడు.

వాడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. వాడు రహదారి పక్కన చతికిలబడి విశ్రాంతి తీసుకున్నాడు.

కొంచెంసేపటికి ఒక మనిషి ఒక కంచర గాడిదనెక్కి రహదారివెంట వచ్చాడు. రాజకుమారుడు ఆ మనిషిని పలకరించి ఆ రహదారి ఎక్కడికి పోతుందని అడిగాడు. ఆ మనిషి చెప్పిన మాటలనుబట్టి ఆ దారి, తూర్పుగా పోతే తన దేశానికి పోతుందనీ, పడమరగా పోతే రాజకుమార్తె ఉండే నగరానికి పోతుందనీ తెలిసింది.





"రాజకుమార్తెనూ, కొయ్యగుర్రాన్నీ పోగొట్టుకుని ఏ మొహంతో ఇంటికి వెళ్లను? చాతనయితే వాటిని సాధిస్తాను," అనుకుంటూ రాజకుమారుడు పడమరదిక్కుగా నడక సాగించాడు.

వాడు కొంతదూరం వెళ్ళేసరికి ఒక పెద్ద ప్రయాణీకుల దండు గుర్రాలెక్కి వస్తూ వాణ్ణి అందుకున్నది. అందరివద్దా ఆయుధాలున్నాయి. గుర్రాలు చక్కగా ముస్తాబు చేసి ఉన్నాయి. అంతా చూస్తే ఒక బ్రహ్మాండమైన ఊరేగింపులాగున్నది. ఈ ఊరేగింపు నడిమధ్యను ఒక రాజోచితమైన వాహనం ఉన్నది. దానికి అద్దాల కిటికీలున్నాయి, బంగారు నగిషీ అలంకరణలున్నాయి. నాలుగు ఉత్తమాశ్వాలు బండిని లాగుతున్నాయి. వాటిపైన సిల్కు, ముఖ్మల్ గుడ్డలు వేసి ఉన్నాయి.

ఈ ఊరేగింపును దాటిపోనిచ్చే ఉద్దేశంతో రాజకుమారుడు రహదారికి ఒక పక్కగా తొలిగి నుంచుని చూడసాగాడు. తలపని తలంపుగా ఆ బండి రాజకుమారుడికి అంతదూరంలోకి వచ్చి ఆగిపోయింది. అందులోనుంచి ఒక మనిషి దిగి, రాజకుమారుడి వద్దకు వచ్చి, "ఏమి అమ్ముతున్నావు?" అని అడిగాడు.

"నేనేమీ అమ్మటంలేదే!" అన్నాడు రాజకుమారుడు ఆశ్చర్యంతో.

ఆ మనిషి రాజకుమారుడి చేతిలోని బుట్టకేసి చూపిస్తూ, "అవి ఫలాలు కావా? మా యువరాజు చాలాదూరం ప్రయాణమై వస్తున్నారు. వారికి చాలా దాహంగా ఉన్నది. ఆకలి వేస్తున్నది. దయచేసి కొన్ని పళ్ళు మాకు అమ్ము," అన్నాడు.

"అవి అమ్మకానికి కాదు, నేను తినటానికి. ఈ దారివెంట మీకు గరికి అయినా కనబడిందా? నేను చాలాదూరం వెళ్లవలసిన వాణ్ణి. ఈ పళ్ళు మీకు అమ్మి నేనేం తినేది?" అని రాజకుమారుడు అడిగాడు.

ఈలోపల యువరాజు బండిలో నుంచి తన మనిషిని త్వరగా రమ్మని కేకపెట్టాడు. ఆ తరవాత అతను మరొక మనిషికి ఒక బంగారు కాసు ఇచ్చి, "ఆ కుర్రవాడు అడిగినంత ఇచ్చి పళ్ళు పట్టుకుని త్వరగా రా," అని చెప్పాడు.

రాజకుమారుడు మొదట వచ్చినవాణ్ణి, "మీరంతా ఎక్కడికి ప్రయాణం?" అని అడిగాడు.

"మా యువరాజు ఫలాని నగరం రాజకుమార్తెను పెళ్ళాడబోతున్నాడు," అని ఆ మనిషి సమాధానమిచ్చాడు, పడమటగా చెయ్యి చూపుతూ.

రాజకుమారుడు నిర్ఘాంతపోయాడు. కాని వాడు తన ఆశ్చర్యాన్ని కప్పిపుచ్చి మరికొన్ని వివరాలు అడిగాడు. ఈ యువరాజు పెళ్ళాడబోతున్నది తన ప్రియురాలినేనని రూఢి అయింది. వాడు బంగారుకాసు తీసుకుని పెద్ద పెద్దవిగా ఉన్న రెండు ఎర్ర పళ్ళూ, రెండు పచ్చ పళ్ళూ ఏరి యువరాజు పంపిన వాడికి ఇచ్చాడు.

యువరాజు వాటిని ఆత్రంగానూ, సంతోషంగానూ తినేశాడు. వెంటనే అతనికి నిద్ర వచ్చేసింది. యువరాజు బండితోసహా పరివారం ముందుకు సాగిపోయారు. కొంత సేపటికి యువరాజు నిద్ర మేలుకుని కంగారుగా అరవసాగాడు. ఏంజరిగిందోనని అతని మంత్రులు పరిగెత్తుకుంటూ బండిని సమీపించారు. కాని వారికి బండిలో యువరాజు కనిపించలేదు — రెండు కొమ్ములూ, మూరెడు బారుగల తెల్లటి గడ్డమూ గల వింత మృగం ఏదో కనిపించింది!

యువరాజుకు పెద్ద ప్రమాదం జరిగిందనీ, పళ్ళు అమ్మిన కుర్రవాడే ఇందుకు కారణం అయి ఉంటాడనీ ఊహించి మంత్రులు ఊరేగింపు నిలుపుచేసి, రాజకుమారుడు వచ్చి కలుసుకోవటానికి ఎదురు చూశారు. —(ముగింపు వచ్చే సంచికలో)






4

త్వరలోనే రాజకుమారుడు పెళ్లివారిని చెర వచ్చాడు. మంత్రులు వాణ్ణి ఆపి, "నువ్వు మా యువరాజుకు అమ్మినవి ఏం పళ్ళు?" అని అడిగారు.

"అవి నేను స్వయంగా చెట్లనుంచి కోసినవేనే!" అన్నాడు రాజకుమారుడు అమాయికంగా.

"అయితే వాటిని తిన్నాక మా యువరాజుగారికి రెండు కొమ్ములెందుకు మొలిచాయి, బారెడు తెల్ల గడ్డం ఎలావచ్చింది?" అని వాళ్లు రాజకుమారుణ్ణి మళ్లీ అడిగారు.

ఈ మాటలు సహజంగా రాజకుమారుడికి ఆశ్చర్యం కలిగించలేదు. అలా జరుగుతుందని వాడికి తెలుసు.

"నేను రోజూ ఈ పళ్ళే తింటున్నాను గదా నాకు కొమ్ములూ, గడ్డాలూ రాలేదే!" అన్నాడు వాడు.

ఇందు కేమనాలో మంత్రులకు తోచలేదు. రాజకుమారుడు కాస్సేపు ఆలోచించినట్టు నటించి, "మీ యువరాజుగారు, కొంపతీసి, ఆ పళ్ళు తిన్నాక నిద్రపోలేదుగద?" అని అడిగాడు.

"నిద్రపోకేం? పోయారు!" అన్నారు మంత్రులు.

"ఇంకేం? అదే కొంప తీసింది! పాపం, మీరు దూరదేశంనుంచి వస్తున్నారులాగుంది, అందుచేత మీ కిక్కడి ఆచారాలు తెలీవు. ఏదన్నా తిని నిద్రపోనేరాదు! నిద్రపోయారో

సి. మాధవరావు



63




కొమ్ములూ, గడ్డాలూ మొలిచాయే!" అన్నాడు రాజకుమారుడు.

ఈ మాటలు విని దూరదేశపు మంత్రులు ముఖ ముఖాలు చూసుకున్నారు. తప్పు యువరాజుదే! లేకపోతే పందిలాగా తిని, ఎందుకు నిద్రపోవాలీ? కాని ఇప్పుడేం చేసేటట్టు? పెద్దచిక్కే వచ్చింది. రాజకుమార్తె ఈ రూపంలో ఉన్న యువరాజును చచ్చినా పెళ్ళాడదు.

"ఈ పెళ్ళికొడుకును తీసుకుపోయి చూపామో మనని చితకదన్నుతారు! అంతకంటె వెనక్కు తిరిగి పోవటమే ఎంతో మేలు," అని మంత్రులు అన్నారు.



"నేను చచ్చినా వెనక్కు తిరిగి పోను. ఆ రాజకుమార్తె మీద ఎంతోకాలంగా ఆశ పెట్టుకుని ఉన్నాను! ఇంతకాలానికి నాకామె దొరికితే ఇప్పుడు జారిపోనిస్తానా?" అన్నాడు యువరాజు.

మంత్రులలో యువరాజు మేలు మరీ మరీ కోరేవాడొకడు ఒక ఉపాయం ఆలోచించి ఇలా అన్నాడు: "పెళ్ళికొడుకని చూపించటానికి ఒక చక్కని యువకుణ్ణి సంపాదించుదాం. అప్పుడు రాజకుమార్తె మనదవుతుంది. ఒకసారి ఆమె మన దేశంలో అడుగుపెట్టాక మన మాట వినక ఏంజేస్తుంది?"

ఈ ఆలోచన చాలా బాగుందని అందరూ ఒప్పుకున్నారు. అందగాడైన యువకుణ్ణి పట్టటమే తరవాయి. తీరాచూడబోతే పరివారంలో వాళ్ళందరికన్నా పళ్ళు అమ్మిన కుర్రాడే అందంగా ఉన్నాడు.

యువరాజు మంత్రులు రాజకుమారుడికి తమ పన్నాగం వివరించి చెప్పి, పెళ్ళి అయినదాకా పెళ్ళికొడుకుగా ఉండమని కోరారు. వాడు తన సంతోషాన్ని పైకి కనబడనియ్యక, "మధ్య నాకేమిటి సంబంధం. మీరూమీరూ ఏమైనాకండి. నాకు లక్ష పనులున్నాయి!" అని బెట్టుచేశాడు.





మంత్రులు రాజకుమారుణ్ణి ఒత్తిడిచేసి బంగారుకాసులు బేరం పెట్టారు. అయిదు కాసులిస్తామంటే చాలదని పేచీ పెట్టి, వాడు ఏడు కాసులు పుచ్చుకుని పెళ్ళికొడుకు కావటానికి ఒప్పుకున్నాడు.



రాజకుమారుడికి మంచి దుస్తులు వేసి బండిలో కూచోబెట్టారు. యువరాజును మామూలు గుర్రంమీద ఎక్కించి, వాడి నెత్తిన ఒక బురఖా వేశారు. నగరం చేరి నాక యువరాజును ఒక గదిలో దాచి ఉంచటానికి ఏర్పాటు జరిగింది. ఈ ఏర్పాట్లన్నీ పూర్తిచేసుకుని పెళ్ళివారు ముందుకు కదిలారు.

రాజుగారు పెళ్ళివారికి నగరం వెలపలనే ఎదురుకోల ఇచ్చి స్వాగతం చెప్పాడు. తనకు కాబోయే అల్లుడు అందగాడయినందుకూ, పెళ్ళివారు భారీగా కట్నాలు తెచ్చినందుకూ ఆయన ఎంతో సంతోషించాడు. ఆయనకు ఒకటే విచారం; అదేమిటంటే, తన కుమార్తె అప్రతిష్ఠ గురించి పెళ్ళివారికి ఎక్కడ తెలిసిపోతుందోనని. ఆ సంగతి ఏమాత్రం తెలిసినా యువరాజు ఆమెను పెళ్ళాడడు. అందుకని రాజుగారు పెళ్ళి ప్రయత్నాలను వాయువేగంతో సాగించాడు. పెళ్ళి విందు నాలుగురోజులపాటు జరగాలి. ఈ నాలుగురోజులూ పెళ్ళివారికి ఊపిరి సలపకుండా విందులూ, వినోదాలూ జరిపించినట్టయితే వారికి రాజకుమార్తె అపఖ్యాతి గురించి తెలుసుకునే అవకాశం ఉండదు.

పెళ్ళివిందు మూడురోజులపాటు సాగింది. ఈ మూడురోజులూ పెళ్ళికూతురు కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూనే ఉన్నది. ఆమె తన ప్రియుడైన రాజకుమారుణ్ణి క్షణంపాటుకూడా మరవలేకుండా ఉన్నది. అందుచేత ఆమె తన మేలిముసుగు ఎత్తి పెళ్ళికొడుకును చూసుకున్న పాపానకూడా పోలేదు.



నాలుగో రోజు రాత్రి విందులో పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ పక్కపక్కనే కూచున్నారు. రాజకుమారుడు రాజకుమార్తెతో రహస్యంగా, "ఇదుగో, చూడు! నేనే వచ్చేశాను!" అన్నాడు.

ఆ మాటలు విని రాజకుమార్తె మేలిముసుగు ఎత్తి అతనికేసి చూసింది. మొట్టమొటద ఆమె తాను కలగంటున్నానను కున్నది. ఎందుకంటే, ఆమెను తండ్రి అతనికిచ్చి ఎందుకు పెళ్ళిచేస్తాడు?

ఆమె ఆశ్చర్య సంభ్రమాలు ప్రకటించి రహస్యం బయట పెట్టేస్తుందేమోనని భయపడి రాజకుమారుడు ఆమెతో, "ఏమీ తెలియనట్టు నటించు," అని హెచ్చరించి జరిగినదంతా ఆమెకు చెప్పాడు. మునురు పోయి ఎండ వచ్చినట్టుగా రాజకుమార్తె దుఃఖం మాని చిరునవ్వు నవ్వింది. తరవాత కొత్త భార్యాభర్తలు ఎంతో సరదాగా సంభాషించుకున్నారు, హాస్యాలాడుకున్నారు, నృత్యంకూడా చేశారు. నృత్యంచేసే సమయంలోనే వాళ్ళు పారిపోయే పథకంకూడా ఆలోచించుకున్నారు.

"అంపకాల సమయంలో నువు మీ నాన్నను కొయ్యగుర్రం కావాలని అడుగు. అది లేకుండా అత్తవారింటికి వెళ్ళనని భీష్మించుకు కూచో. బెదిరింపులకు కూడా



లొంగకు!" అని రాజకుమారుడు రాజకుమార్తెకు సలహా ఇచ్చాడు.

మర్నాడు అంపకాలు. ఆస్థానంలోని పెద్ద ఉద్యోగులందరూ రాజభవన ద్వారం వద్ద చేరి రాజకుమార్తెను సాగనంపటానికి సిద్ధంగా ఉన్నారు. రాజకుమారుడూ, పరివారమూ, మంత్రులూ, బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నారు.

రాజభవనంలో రాజకుమార్తె తన తండ్రి కాళ్ళు పట్టుకుని తనకు కొయ్యగుర్రం ఇచ్చెయ్యమని ప్రార్థిస్తున్నది.

రాజు మండిపడ్డాడు. "తలారిని పిలిపించి ఇప్పుడే నీ తల తీయించగలను జాగ్రత్త!" అని కూతుర్ని భయపెట్టి చూశాడు కూడా. రాజకుమార్తె భయపడక, "ఆ గుర్రం లేకుండా వెళ్ళేకన్న చావటానికైనా నేను సిద్ధమే!" అన్నది.

రాజుకు ఒక చెంప కోపమూ, మరొక వంక ఆందోళనా కలిగాయి. ఏమి చెయ్యాలో ఆయనకు పాలుపోలేదు.

ఇంతలో బయట వేచిఉన్న పెద్దలు లోపలికి వచ్చి, "ఏమిటి ఆలస్యం, మహారాజా?" అని అడిగారు.

"ఈ పిచ్చిది ఏదో కొయ్యగుర్రాన్ని వెంట తీసుకుపోతానని నన్ను వేధిస్తున్నది," అన్నాడు రాజు వారితో.






పెద్దలు నవ్వి, "అయితే ఆ కొయ్య గుర్రాన్ని ఇచ్చి పంపరాదా? ఇదొక సమస్యా ఏమిటి?" అన్నారు.

రాజుకిక తప్పలేదు. ఆయన నౌకర్లచేత కొయ్యగుర్రాన్ని తెప్పించి తన కుమార్తె కిచ్చాడు. ఆ తరవాత పెళ్ళివారు వీడ్కోలు ముగించి తరలి పోయారు.

ప్రయాణం చాలారోజులు పట్టింది. కాని ప్రతి క్షణమూ యువరాజు భటులు రాజకుమార్తెనూ, రాజకుమారుణ్ణీ వెయ్యి కళ్లతో కనిపెడుతూ, తప్పించుకు పారిపోవటానికి వారికి చీమతలకాయంత అవకాశం కూడా చిక్కనివ్వలేదు. గమ్యస్థానం దగ్గిర పడు



తున్నకొద్దీ ప్రేయసీ ప్రియుల ఆందోళన కూడా హెచ్చింది. అయితే ఆఖరు క్షణంలో రాజకుమారుడికి ఒక యుక్తి తట్టింది. వాడు దాన్ని రాజకుమార్తెకు చెప్పాడు.

ప్రయాణం పూర్తి అయింది. వారు యువ రాజుండే భవనద్వారం చేరారు. రాజకుమార్తె మంత్రులను పిలిచి, "గృహ ప్రవేశం చేసేముందు బంగారు మాడలు విరజిమ్మటం మా దేశాచారం. ఏడు పళ్లాల నిండా బంగారు మాడలు పోసుకు రండి. నేను వాటిని విరజిమ్ముతాను. వాటిని ఎవరు కావలిస్తే వారు ఏరుకోవచ్చు," అన్నది.

నిజంగా అలాటి ఆచారం ఉందికాబోలు ననుకుని మంత్రులు ఏడు పళ్ళాలతోనూ బంగారు మాడలు తెప్పించారు. రాజకుమార్తె వాటిని అన్నివైపులా విరజిమ్మింది. అంతదాకా ఆమెను కంటి రెప్పలాగా కాపాడుతున్న నౌకర్లు ఆ బంగారాన్ని ఏరటానికి దూరంగా పరిగెత్తారు.

ఆ గందరగోళంలో రాజకుమారుడు కొయ్యగుర్రాన్ని నేలపై పెట్టి ఎక్కి కూచున్నాడు. అతని వెనకగా రాజకుమార్తె ఎక్కి కూచున్నది. రాజకుమారుడు గబగబా మీటలన్నీ వదులుచేశాడు. ఏం జరిగిందో మంత్రులు అర్థంచేసుకునే లోపల కొయ్య

గుర్రం రాజకుమార్తెనూ, రాజకుమారుణ్ణీ తీసుకుని ఆకాశంలోకి రివ్వున ఎగిరి క్షణంలో కనపడకుండా పోయింది....

ఈలోపల రాజకుమారుడి తండ్రి తన కొడుకు ఏమైపోయాడోనని తహతహలాడి పోతున్నాడు. ఉదయం వెళ్ళిన కుర్రవాడు సాయంకాలందాకా రాకపోయేసరికి ఆయన వడ్రంగి మీద అలిగి, వాణ్ణి ఖైదులో పెట్టించాడు.

ఆ తరవాత రోజులూ వారాలూ గడిచినా రాజకుమారుడు తిరిగి రానేలేదు. ఆ దిక్కుమాలిన కొయ్యగుర్రం ఏ సముద్రం మీదుగా ఎగురుతూ పడిపోయిందోనని ఆయన కొంత మంది మనుషులను ఉక్కు చేపలో సముద్రాలన్నీ ఘాలించమని పంపాడు. రాజభవనంలో ఇంతకాలమూ ఒక వినోదంగాని, ఆనందంగాని లేదు. రాజుగారు తన కొడుకుపై అన్ని ఆశలూ వదులుకుని వడ్రంగిని ఉరితీయించమని ఉత్తరువుకూడా ఇచ్చాడు.

అటువంటి పరిస్థితిలో రాజకుమారుడు తన భార్యతో సహా ఇల్లు చేరుకున్నాడు. వాడు తన తండ్రితో, "నాన్నా, ఈ కొయ్యగుర్రాన్ని మించిన వింత ప్రపంచంలో మరొకటి ఉండదు. దాని సహాయంతోనే నేను ఎన్నో దేశాలు తిరిగాను, ప్రపంచలోకెల్లా అద్భుత సుందరి అయినదాన్ని భార్యగా సంపాదించుకుని ఇంటికి తిరిగి వచ్చాను. ఆ వడ్రంగికి ఎంత ఇచ్చినా అతని ఋణం తీరదు!" అన్నాడు.

కొడుకు కథ అంతా విన్నాక రాజుకు సంతోషమూ, వడ్రంగిని ఖైదు చేయించినందుకు పశ్చాత్తాపమూ కలిగాయి. ఆయన వెంటనే వడ్రంగిని విడిపించి, క్షమాపణ చెప్పుకుని గొప్పగొప్ప బహుమానాలిచ్చాడు.

రాజకుమార్తెకూ రాజకుమారుడికీ మరొకసారి వైభవంగా పెళ్ళి జరిగింది. ఆ తరవాత వారు సుఖంగా ఉన్నారు.

—[సమాప్తం]

